# విష్ణు సహస్రనామము

(నామరత్నమాలిక)



వ్యాఖ్య

స్వామి సుందరచైతన్యానంద

# FORE WORD

Swami Sundara Chaitanyananda who has written several books in Telugu and English on various aspects of our Sanatana Dharma and who is engaged in singing with his musical voice and expounding with his speaking gifts, the glories of God, the one indwelling Divine and of the spiritual life, before large audiences all over Andhra Pradesh, has now brought out this detailed Telugu translation and exposition of 'The Vishnu Sahasranamamu', which is a hymn very dear to the Hindu devotees all over the world, many of whom recite it from memory every day.

Some years ago, Hindu devotees were privileged to get a long playing record of the Vishnu Sahasranama rendered in the melodious voice of Srimati M.S. Subba Lakshmi.

This Book will now help all Telugu-speaking devotees to enjoy that recitation better, through understanding the meaning and spiritual and philosophical significance of every one of the thousand names of the great hymn.

I am very glad to introduce this book to the Telugu-speaking world which will remain indebted to Swami Sundara Chaitanyananda for this service, while he, on his part, has done it only as a worship of Lord Vishnu through humble service to His Children in the men, women and children of the world. I hope the book will help to increase their love of God and love and service of man, irrespective of caste, creed, race or sex.

SWAMI Ranganadhananda

Ramakrishna Math,

Domalaguda, Hyderabad - 500 029.

# ఆముఖం

మన సనాతన ధర్మానికి సంబంధించిన వివిధ విషయాలపై ఆంధ్రములోను, ఆంగ్లములోను అనేక గ్రంథాలు రచించి, తన మధుర సుస్వరంతో, గాననిరతుడై, ఆంధ్రప్రదేశ మంతటా బ్రహ్మాండమైన సభలలో తన వాగ్వైఖరీ శబ్దఝురులతో భగవద్విభూతులను, సర్వ హృదయాంత ర్వాసియైన ఏకైక దివ్యత్వాన్ని, ఆధ్యాత్మిక జీవితమును గూర్చి వివరించు వారును అగు సుందర చైతన్యానంద స్వామి, ప్రస్తుతం, ప్రపంచములోని హిందూ భక్త జనులకు ప్రియమైనదియు, వారిలో అనేకులచే ప్రతి దినము పారాయణ చేయబడునదియు నగు "విష్ణు సహస్రనామము" అను స్తోత్రరాజమునకు ఆంధ్రానువాదం, సాకల్య వివరణం ప్రచురించారు.

కొన్ని ఏండ్ల క్రితం శ్రీమతి యం.యస్. సుబ్బలక్ష్మిగారిచే మంజుల సుస్వరంతో గానం చేయబడిన విష్ణు సహస్రనామ సుదీర్ఘమైన ప్లేయింగ్ రికార్డు పొందే భాగ్యానికి హిందూభక్త జనులు నోచుకున్నారు.

ఇప్పుడీ గ్రంథము విష్ణు సహస్రనామ పఠనాన్ని అవగాహనతో, అర్థయుక్తంగా ఆస్వాదించడానికి, మరియు ఈ మహాస్తోత్రములోని వేయినామములలో ప్రతినామము యొక్క ఆధ్యాత్మిక, తాత్త్విక ప్రాముఖ్యాన్ని మరింత బాగుగ గ్రహించడానికి తెలుగు మాట్లాడే భక్తజనులకు సహకరిస్తుంది.

నేను ఈ గ్రంథాన్ని తెలుగు ప్రజానీకానికి పరిచయం చేయడానికి చాలా సంతోషిస్తున్నాను. ఈ సేవకు తెలుగు ప్రజానీకం బ్రహ్మచారి సుందరరాజన్‌కు ఋణపడి యుంటుంది. ప్రపంచమందలి మానవులలో, స్త్రీలలో, పాపలలో ఉండే పరమేశ్వరుని అనుంగుబిడ్డలకు సేవచేయడమే మహావిష్ణు అర్చనగా భావించి అతడు ఈ సేవ చేశాడు.

జాతి, మత, కుల, లింగ వివక్షత లేకుండా మానవప్రేమను, మానవసేవను, భగవద్భక్తిని పెంపొందించుకొనుటకు ఈ గ్రంథము సాయపడునని ఆశించుచున్నాను.

స్వామి రంగనాథానంద

రామకృష్ణమఠము
దోమలగూడ, హైదరాబాద్.



# DIVINE OFFERING

*Vishnu Sahasranama Stotra is an illimitable ocean. It is an unbounded ocean of wisdom-nectar. This holy Stotra constitutes superb spiritual literature. In this wonderful ocean are hidden a thousand pearls of wisdom. Every gem in this miraculous ocean is most precious and beams with the dazzling brilliance of a million suns. Who ever is bathed in wisdom-light of the ocean of Vishnu Sahasranama Stotra is freed from nescience and attains to the blessedness of immortality and eternal bliss.*

*The Lord is an embodiment of love. The Lord's name is replete with sweet love. "Vachya vachakayoh abhedah". The divinity and the Divine name are not different. They are identical. Nama is a safe boat which transports the individual souls to the Nami. Hence the thousand names in this Sahasranama Stotra serve as a thousand beautiful paths leading us to the holy presence of the Lord of truth, Satya Natha. Every Name is replete with the glory and splendour of the thousand Names.*

*Vyasa Bhagavan praised Veda Narayana with the thousand eternal effulgent names and he was highly delighted with his discription of the Lord. Bhishma, the foremost of the devotees praised the Lord and felt ecstatic bliss. Countless devotees are attaining the proximity of the Lord of Truth, Satya Deva through daily recitation of the Stotra and good conduct. Many commentaries came forth. Many reviews came to light. It became a unique Stotra. It remained a super work.*

*My mind craved to read it. I liked it even in my boyhood. I remembered and remembered its great glory. I*

*recited the Stotra for several years. The showers of the recitation of the Stotra fell on the fertile tablet of my tender heart and there sprouted the plants of understanding and I was induced and impelled to spread the thoughtful divine blossoms collected by me. On the holy path trodden by the devotees of the beautiful azured Lord,Syama Sundara, I wrote a succinct commentary in Telugu. Not for the pleasure of writing did I write it but for the enjoyment of the feeling of ecstatic bliss. I wanted to melt my little self in His tender and blue effulgent light. The work is completed but His worship continues for ever.*

*I have befittingly named the commentary 'Nama Ratna Malika' as I have tried to explain that those thousand Names are not isolated ones nor Names susceptible to disintegration but they are the united ones found in one unbroken beautiful divine garland.*

*His Holiness poojya Sri Swami Ranganadhanandaji Maharaj, the president of Sri Rama Krishna Math, the expounder of the lore of Vedanta in the modern scientific light, a stotriya Brahma Nishta, the swami of inter-national fame has written the preface to this commentary of Nama Ratna Malika and bestowed his blessings on me. My heart felt and worshipful prostrations unto him.*

*O devotees of the Lord, O lovers of the Lord's devotees, wear this glorious Nama Ratna Malika, shine as the devotees of lord Vishnu and attain the beautitude of life or oneness with Him.*

with Ananta prem,

**Swami Sundara Chaitanyananda**



# నివేదన

విష్ణు సహస్రనామ స్తోత్రమొక మహాసముద్రము. అమృత జ్ఞాన సాగరము. ఇది ఒక గొప్ప ఆధ్యాత్మిక సాహిత్యము. ఈ పవిత్ర సాగరములో సహస్ర జ్ఞాన రత్నములు దాచబడియున్నవి. ఇందులోని ప్రతి రత్నము అమూల్యమై, సహస్ర శత ఆదిత్య తేజముతో ప్రకాశించు చున్నది. అట్టి జ్ఞాన ద్యుతిలో తడిచిన వాని అజ్ఞానము అంతమొందించబడుచున్నది. అమృతత్వము ప్రసాదించబడుచున్నది.

భగవానుడు ప్రేమ స్వరూపుడు. భగవన్నామము ప్రేమమయము. "వాచ్య వాచకయోరభేదః" నామమునకు నామికి తేడా లేదు. నామమే జీవులను నామివద్దకు జేర్చునావయై ఉన్నది. కనుక ఈ సహస్రనామ స్తోత్రములోని సహస్రనామములు సత్యనాథుని సన్నిధికిచేర్చు సహస్రమార్గములై యున్నవి. ప్రతి నామము వేయి నామముల మహిమను కల్గియున్నది.

నిత్య వెలుగులను విరజిమ్మే వేయి నామములతో వేదనారాయణుని వర్ణించి తృప్తి చెందాడు వ్యాస భగవానుడు. కీర్తించి సంతృప్తి నొందాడు భక్తాగ్రగణ్యుడైన భీష్ముడు. నిత్య పారాయణ, ఆచరణాదుల ద్వారా పావనులై సత్యదేవుని సమీపిస్తున్నారు ఎందరో భక్తులు. వ్యాఖ్యలు కదిలాయి. సమీక్షలు దొర్లాయి. సాటిలేని స్తోత్రమై వెలసింది. మేటి గ్రంథమై మిగిలింది.

చదువుదామని నాకు స్ఫురించింది. చిన్నతనంలోనే వరించాను. స్మరించాను, అనుస్మరించాను. చాలాకాలము పారాయణ సాగించాను. ఈ స్తోత్ర పారాయణా జల్లులు నా హృదయసీమపై పడగా, ఆ స్ఫూర్తిలో మొలకెత్తిన అవగాహనా మొక్కలనుండి పూసిన భావకుసుమాలను కోసి, శ్యామసుందరుని సన్నిధికి చేరే భక్తజనుల బాటలో పరచాలని, కనుపరచాలని అనిపించింది. ఆంధ్రంలో వ్యాఖ్యానము రచించాను. రచించాలని వ్రాయలేదు. రమించాలని వ్రాసాను. అతని కోమల శ్యామల వర్ణకాంతిలో కరిగిపోవాలని వ్రాసుకున్నాను. రచన ముగిసింది. అర్చన సాగుతూనే యుంటుంది.

ఈ సహస్ర నామములు విడిరత్నములు కావని, విడిపోయేవి కాబోవని, ఒకేమాలలో ముడిపడియున్నవని ఈ గ్రంథములో ప్రయత్నించి చూపుట వలన ఈ వ్యాఖ్యానము "నామరత్నమాలిక" యను నామమును సంతరించుకొన్నది.

ఈ వ్యాఖ్యానమునకు శ్రీ రామకృష్ణ మఠాధ్యక్షులు, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులు. ఆధునిక విజ్ఞానశాస్త్ర దృక్పథములో వేదాంత విజ్ఞానమును ప్రబోధించుచు, అంతర్జాతీయ ఖ్యాతి గడించిన పూజ్య శ్రీ రంగనాథానంద స్వాములవారు ఆముఖము వ్రాసి ఆశీర్వదించారు. వారికి నా సాష్టాంగ దండ ప్రణామములు.

భక్తులారా! భాగవత ప్రియులారా! ఈ నామరత్నమాలికను ధరించి, విష్ణు ప్రియులై, విష్ణుస్వరూపులై తరించండి.

భగవత్సేవలో
మీ
స్వామి సుందరచైతన్యానంద



జ్ఞానబ్రహ్మ

పూజ్యశ్రీ స్వామి సుందర చైతన్యానంద



# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము

### ఉపోద్ఘాతము

## నామ మహిమ

శుభప్రదమై శోభిల్లు ఈ ప్రపంచ మొక గొప్ప శిక్షణా శిబిరము. ఆధ్యాత్మిక శిక్షణా కేంద్రము. సర్వులకు ప్రాణతుల్యమైన అమృతజీవనమే ఈ కేంద్ర మందించు ఉచిత విద్య. ఉన్నత విద్య. సముచిత సమున్నత విద్య. అదియే ఆధ్యాత్మవిద్య. అ విద్యను అంత మొందించు ఆత్మ విద్య. మృత్యువును శాశ్వతముగా మాయంచేసే అమృతవిద్య. రాకపోకల గుట్టు తెలిపే రాజవిద్య. భ్రమ లుడిగింపజేసే బ్రహ్మవిద్య.

"ఆధ్యాత్మ విద్యా విద్యానాం"

ఆధ్యాత్మ విద్యయే సరియైన విద్య. వ్యక్తిని సరిచేయు విద్య. సత్య సమీపమునకు నడిపించు విద్య. నిత్యానందము నందించు విద్య.

"విద్" అను సంస్కృత ధాతువునుండి విద్య అనుపదము పుట్టినది. "విద్" అనగా తెలుసుకొనుట యని భావము. విద్య యనగా తెలుసుకొనదగినది. జ్ఞాన రూపము అనిఅర్థము. మరి తెలుసుకొనదగినది ఏది? ఈ దృశ్యమాన జగత్తులో మనము సమస్తమును తెలుసుకొనుచున్నాము. అన్నింటిని తెలుసుకొనే తెలివిని గూర్చి తెలుసుకొనే ప్రయత్నము చేయలేక పోతున్నాము. ప్రాపంచిక వస్తుప్రపంచస్థితిని ఎంతగా ఆకళింపుచేసుకున్నను, మానవునికి బాధలు తీరడంలేదు. దుఃఖం తప్పడంలేదు. శోకం అంతరించడంలేదు. కన్నీళ్ళు ఆరడం లేదు. ఏది తెలుసుకొంటే సర్వము తెలియబడుతుందో దానిని తెలుసు కోవడంచేత సమస్త దుఃఖములు తొలగిపోతాయి. క్లేశములన్నీ కనుమరుగవుతాయి. తెలియబడే వస్తుప్రపంచ సంఘాతమునంతా ఒకేశక్తి గ్రహించునపుడు అట్టి శక్తిని తెలుసుకొంటే సమస్తము అందులో అంతర్భూతమయ్యే యున్నది. అదియే చైతన్యము. ఆధ్యాత్మము.

"స్వభావోఽధ్యాత్మ ముచ్యతే"

"ఆధ్యాత్మమనగా నీ స్వభావమే. ప్రతి వ్యక్తిలో అంతర్యామియై, ప్రత్యగాత్మయై వెలుగు పరమాత్మయే ఆధ్యాత్మమని పిలువబడు చున్నాడు. ప్రారంభములో ప్రత్యగాత్మవలె గోచరించి, జ్ఞానానుభూతిలో పరమాత్మయేనని తెలియబడు జ్ఞానమే ఆధ్యాత్మము" అని శ్రీ శంకరులు గీతాభాష్యంలో తెలియజేసి యున్నారు.

స్వరూపస్థితిని ఎఱుకపరచునదియే ఆధ్యాత్మవిద్య యని తెలియవచ్చినది. స్వరూపానుసంధానమే ముక్తి లేక మోక్షము. రెండవ వస్తువు తెలియని అద్వైతానుభూతి. ఇది సహజస్థితి. ఉన్నదేగాని క్రొత్తగా కొన్నదికాదు. నేటి స్థితియేగాని రేపటి పరిస్థితికాదు. మరచిన విషయమును స్మృతికి తెచ్చు కొనుటయేగాని నూతన సృష్టి మాత్రము కాదు. ఏ కారణముచేతనో అడ్డునిలచి, ఆవేదన నందించిన విస్మృతిని తొలగించుటయేగాని, తన కన్యమైన సమస్య విషయములో చేయు పరిష్కృతి కానేకాదు.

మోక్షాపేక్ష యనునది అంతర్యంలో కదిలిన అలజడియేగాని, బాహ్యంలో అందిన ఆవేదన కాదని గ్రహించాము. అంతర్యములోని ఆందోళన అణగి, ఆత్మానుభూతి కలుగవలయునన్నచో అన్వేషణ జరుగవలసింది అంతర్యము లోనే గాని బాహ్యంలో కాదు. సత్యపదార్థమును దర్శించి, అనుభవించుటకు అంతర్యములో జరిగే ప్రయత్నాలే సాధనలు. స్వతస్సిద్ధమై భాసిల్లు

స్వరూపస్థితికి సాధనలావశ్యకత ఏమిటి? అను సందియము రావచ్చును. మల ఆవరణ విక్షేపాదులను తొలగించుటకే సాధన ఉపకరించును. కర్మలైన సాధనల ద్వారా జ్ఞానస్వరూపమైన ఆత్మ అనుభవమునకు అందదు. సాధనల ఫలితముగా మల, విక్షేప, ఆవరణాదులు తొలగగా ఆత్మ స్వప్రకాశమై వెల్గొందును. అద్దముపై మాలిన్యము చేరినపుడు అందులో ప్రతిబింబము గోచరము కాదు. శుద్ధిచేయుట అను కర్మద్వారా దర్పణముపై ఏర్పడియున్న మురికిని తుడిచివేసి, శుభ్రము చేయగనే దర్పణము పరిశుద్ధమై, రూపమును ప్రతిబింబించును. ఆత్మానుభూతిని పొందుటలో ఆధ్యాత్మిక సాధనలన్నియు శుద్ధిచేయు ప్రక్రియలే యని గ్రహించవలయును.

ఆధ్యాత్మికసాధన లనేకములు. ధ్యానము, యజ్ఞము, జపము, అర్చన, యోగము మొదలగు సాధనలెన్నియో గలవు. అనంతకోటి కళ్యాణగుణ సంపన్నుడైన భగవానుని పొందుటకు అసంఖ్యాకమైన సాధనలుండినను, కలియుగములో సంసార జలధిని దాటించగలిగిన ఏకైక దివ్యసాధన నామసంకీర్తనయే నని శాస్త్రములు ఘోషిస్తున్నవి. మహాత్ములు ప్రవచిస్తున్నారు.

"ధ్యాయన్ కృతే యజన్యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్"

"కృతయుగములో ధ్యానముచేత, త్రేతాయుగములో యజ్ఞముచేత, ద్వాపరయుగములో అర్చనచేత ఎట్టి ఫలితము కలుగుచున్నదో కలియుగములో ఆ ఫలము భగవన్నామసంకీర్తనలచే లభించును" అని విష్ణుపురాణము తెలియజేయు చున్నది.

"యజ్ఞానాం జప యజ్ఞోస్మి"

"యజ్ఞములలో నేను జప యజ్ఞమును" అని భగవానుడు భగవద్గీత విభూతి యోగములో నామప్రభావమును నొక్కి వక్కాణించి యున్నాడు. హింసతో కూడిన యజ్ఞము గాకపోవుటచేత జపయజ్ఞము సర్వ యజ్ఞములలో ప్రశస్తమైనదనిభావము.

"జపస్తు సర్వధర్మేభ్యః పరమోధర్మ ఉచ్యతే
అహింసయా చ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే"

"సమస్త ధర్మములలో జపమే ఉత్తమ ధర్మమని తెలియజేయబడినది. అహింసమీద ఆధారపడి యుండుటచే జపయజ్ఞము ఉత్తమమైనదిగా, భగవానుని విభూతిగా గుర్తించబడనది" యని మహాభారతము తెలియజేయుచున్నది.

భగవన్నామము అమృతతుల్యమైనది. అమృతత్వము నొసంగునది. భవబంధాలలో తగుల్కొనిన మానవుని విడుదలచేసి, విముక్తిని ప్రసాదించు దివ్యాస్త్రమై యున్నది. గాలిచే మేఘములు చెదరిపోగా సూర్యుడు ప్రకాశవంతమై శోభిల్లునట్లు, భగవన్నామ మారుతముచే అజ్ఞాన మేఘములు చెదరిపోగా ఆత్మ స్వప్రకాశమై దేదీప్యమానముగ శోభిల్లును. నామయోగికి మలినములు అంటవు. మాయ చేరదు. జలాంతర్గామిలో పయనించు వ్యక్తిని నీరు అన్నివెపుల ఆవరించియున్నను ఆ జలము తనను అంటలేని విధముగ, నామరూపాత్మకమైన విషయ ప్రపంచములో నామయోగి వసించుచున్నను విషయ సుఖాలు అతనిని కదిలించలేవు. కలవరపరచనూ లేవు. కాలుష్యము లంటని కమనీయస్థితి అతనికి నామమహిమచే ప్రాప్తించినది.

భగవన్నామోచ్ఛారణచే కదిలే శబ్దతరంగాలు మనస్సును శుద్ధిచేసి, హృదయమును శాంతపరచును. నామమే నారాయణుడని గ్రహించాలి. మధురమైన ఈ నామసాధన మానవుని మాధవునిగా మార్చును. భగవన్నామము నాశ్రయించిన వ్యక్తి భగవద్భక్తుడగును. భగవద్భక్తునికి అసాధ్యమంటూ ఉండదు. భగవంతుడే అతనికి పతియై గతియై నిలుచును.

"తమహముపసృతానాం కామపూరం నతోఽస్మి"

"తన నాశ్రయించిన భక్తుల అభీష్టములను నెరవేర్చి, రక్షణ నందించు వానిని శరణుజొచ్చి యున్నాను" అని శ్రీమద్భాగవతము అష్టమ స్కంధములో తెలుపబడినది.

నిరంతరము భగవన్నామామృతమునే పానముచేయు అలవాటును ఏర్పరచుకో. నామము ప్రేమను చిందుస్తుంది. అట్టి దివ్యమైన ప్రేమ ప్రేమ స్వరూపుడైన శ్రీకృష్ణుని అందిస్తుంది. నామములో సదా రమించు. ప్రపంచమే నీకు దాసోహమంటుంది. నామ మహిమ వర్ణనాతీతము. నామము నీ నాలుకపై కదలుతుంటే చాలు. నారాయణుడు తదనుగుణముగా నీ హృదయములో నాట్యము చేస్తుంటాడు. ఆదిదేవుని నాట్యభంగిమలను దర్శించి, ఆనందించుటకు అలవాటుపడిన నీనుండి అవిద్యాజనిత భోగవిలాస క్రీడలు ఎలా కదులుతాయి?

మనస్సు నిర్మలమవుతుంది. హృదయం నిర్వికల్ప చైతన్యముతో నిండిపోతుంది. దృష్టి నిరంజన మవుతుంది. సృష్టి నిత్యనాథుని సత్యమందిరమై భాసిస్తుంది.

"మనీషితం చ ప్రాప్నోతి చిన్తయన్ మధుసూదనమ్
ఏకాన్త భక్తిః సతతం నారాయణ పరాయణః"

"ఏకాంత భక్తితో పరాత్పరుడైన నారాయణునే ఉత్తమ గతిగా భావించుచూ, సదా మధుసూదనునే చింతించువానికి మోక్షప్రాప్తి కలుగును" అని మహా భారతములోని శాంతిపర్వమునందు తెలుపబడినది.

భగవానుని దర్శనప్రాప్తి కలుగలేదని చింతించకు. భగవన్నామమును నీ సొత్తు చేసుకో. భగవానుడు నిన్ను హత్తుకొనే యుంటాడు. భగవన్నామములో నీకు అభిరుచి కలుగకపోవుటకు కారణము ఇంతవరకు నీవా దివ్యామృత పానము చేయకపోవుటయే. ఒక్కసారి ఆస్వాదించి చూడు. ఆ తరువాత నామమే నిన్ను స్వాధీనం చేసుకుంటుంది. బ్రతుకులో స్వారస్యం చూపిస్తుంది. అనుక్షణము నిన్ను ఆనందడోలికలలో ఓలలాడునట్లు చేస్తుంది. రామ నామామృతాన్ని పానము చేయవలెనని కదా పరమశివుడు కైలాసమును వీడి బిల్వవృక్షము క్రింద ఆసీనుడై ధ్యానచిత్తుడయ్యాడు? భగవన్నామ సుధా రసమును గ్రోలుటకే కదా శుకబ్రహ్మ ఇల్లు విడిచి, దిగంబరియై చరించి తరించాడు? నారాయణ దివ్యనామ ప్రభావమును అనుభవిస్తూ, ఇతరులకు అందించుటకే కదా నారదమహర్షి త్రిలోక సంచారి అయ్యాడు? ఎచ్చట వసించినా, ఏ ప్రదేశమున సంచరించినా భక్తుడు ఒంటరివాడుకాడు. కాలేడు. విశ్వాధారమైన వాసుదేవుడు తన హృదయాంతరాళములలో వసించుచుండ తానెలా ఒంటరివాడవుతాడు? జగదీశ్వర చైతన్యములో సదా రమించు భక్తుని జగద్భ్రాంతి మోసము చేయకలదా? అసంభవము. శీతలోదకమునందు మునిగి యున్న వానిని సూర్యుని తీవ్ర కిరణజ్వాల దహించగలదా? గట్టుపైనున్న వారిజుట్టును ఉడికించగలదేమోగాని, నీటిలో ఉన్నవానిపై తన ప్రభావమును చూపగలదా? భగవన్నామామృతమనే శీతలోదకములో ఈదువానిని ప్రాపంచిక విషయవాసనా జ్వాల ఏమి చేయగలదు? సంసార తాపత్రయ గట్టుపైనున్న వానిపైననేగాని భగవద్భక్తునిపై తన ప్రభావమును చూపగలదా? భగవద్భక్తుని వంచించు శక్తి ఎవరి కున్నది? భగవన్నామము గానముచేయు భక్తుని

హింసించు సామర్థ్యము ఎవరికున్నది? భక్తుడైన వానికి తన సంకల్ప ప్రయత్నము లేకనే సర్వము సమకూడును.

"సర్వాన్ కామానవాప్నోతి సమారాధ్య జగద్గురుమ్
తన్మయత్వేన గోవిన్ద మిత్యేతద్ దాల్భ్య నాన్యథా"

"ఓ దాల్భ్యా! జగద్గురువైన గోవిందుని తన్మయత్వముతో నిత్యము ఆరాధించు వానికి సకల కామ్యములు సిద్ధించును." అని విష్ణు ధర్మోత్తర పురాణమందు తెలుపబడినది.

సర్వాభీష్టములను నెరవేర్చు శ్రీహరి నీచెంత యుండగా అస్థిరమైన అన్యవస్తువుల పొందుగోరి అలమటించెదవేల? అది కేవలము నీ అవివేకము. సత్యాసత్య విచక్షణ కొరవడుటచే ఏర్పడిన అజ్ఞానము. గంగాతీరములో ఆసీనుడవై దప్పికతీర్చుకొనుటకు జల కూపములను వెదుకుచుంటివా? ఎంతటిఅన్యాయ స్థితిలో యున్నావో క్షణమాలోచించి చూడు. ఈషణ త్రయములో ఈదులాడుతూ జీవితమునే నిరర్థకముగా మార్చుకొను చున్నావు. స్త్రీ ధన వస్తు కనకాదులలో శాశ్వతసుఖము లభించునని భ్రమపడుచున్నావు. అదే వాస్తవమైనచో గౌతమ బుద్ధుడు ఏల సన్యసించెను? ధనదాహంతో నీవు కాలాన్ని ఖర్చు చేయుచున్నావు. ధర్మ చింతనతో దైవభక్తి కలిగిన ఎందరు రాజులు, చక్రవర్తులు సకల సంపదలను త్యజించి, సారభూతమైన సత్యవస్తు ప్రాప్తికి ప్రయత్నించిరో ఆలోచించు. భ్రాంతి తెర తొలగగానే శాంతిస్వరూపము అనుభవమునకు అందుతుంది. కనుక భగవన్నామమును ఆశ్రయించు. అంధకారమున్నదని అధైర్యపడకు. నామజ్యోతిని పట్టుకో. చీకటిలో అది నీకు వెలుతురై దారిచూపుతుంది. దరి చేర్చుతుంది. బ్రతుకును మార్చుతుంది. బాధను తీర్చుతుంది. తృష్ణని ఆర్పుతుంది. కృష్ణుని ముందుంచుతుంది. ధన్యునిగా మార్చి, పునర్జన్మను నిరోధిస్తుంది.

"ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామః
దశాశ్వమేధా వభృథేన తుల్యః
దశాశ్వమేధీ పునరేతిజన్మ
కృష్ణ ప్రణామీ న పునర్భవాయ "

"శ్రీకృష్ణునకు ఒక్కసారి వందన మొనర్చినచో అది పది అశ్వమేధయాగాల ఫలముతో సమానము. దశాశ్వమేధయాగ మొనరించిన వానికి పునర్జన్మ ప్రాప్తించును. శ్రీకృష్ణదేవునికి వందన మొనర్చువానికి పునర్జన్మ లేదు. అని శాంతి పర్వము.

శ్రీకృష్ణుడు దయాసముద్రుడు. తన నాశ్రయించిన వారెవ్వరూ వట్టి చేతులతో తిరిగి వెళ్ళలేదు. ఆయన సాన్నిధ్యంలో నిరాశ జనించదు. ఆయన సారథ్యంలో అపజయం స్ఫురించదు. అతడు ప్రేమ మయుడు. నీలో ప్రేమ కదలినపుడు అతడు నీ ముందు నిలుస్తాడు. ప్రేమ నీలో కనుమరుగైనపుడు అతడు అదృశ్యమవుతాడు. అవియే తాను క్రీడించే దాగుడుమూతలు. మనస్సులో ప్రేమ కదలుచుండ, నేత్రములలో ఆనందబాష్పములు నిండియుండ, హృదయపు లోతుల నుండి నామమును పారవశ్యంతో కదలించు. పెదవుల నుండి మాత్రమే కదలే నామము భగవానుని కదలించదు. కేవలం భగవన్నామము నుచ్చరిస్తే చాలదు. అది మన ప్రియతమ నాయకుడైన శ్రీకృష్ణుని దివ్య నామమనే విషయం మరువకూడదు. శ్రీకృష్ణుడు మనప్రియుడు, సఖుడు, ప్రాణనాథుడు. పిడికెడు అటుకులకు స్వర్గసౌఖ్యములను కుచేలుని కందించినది అతడేనని మరువకు. ముజ్జగములను తన కుక్షిలో నింపుకొనియున్నను మజ్జిగ త్రాగిన నేరానికి మగువల మధ్య అలసిపోయేలా నృత్యం చేసిన భక్తాధీను డాతడే యనునది సదా జ్ఞాపకముంచుకో. ప్రేమబంధము బలీయమైనది. దానిని త్రెంచుటకు చతుర్ముఖ బ్రహ్మకు కూడా సాధ్యపడదు. నీలో కదలే ప్రతి సంకల్పము శ్రీకృష్ణునిదై యున్నదో లేదో పరిశీలించి తెలుసుకో. జగత్తంతయు జగదీశ్వరుని మందిరముగా దర్శించు. ప్రపంచమే బృందావనియై శోభించనీ. నీ హృదయమే యమునానదియై కదలనీ. నీ మనస్సే నవనీతమై శ్రీకృష్ణుని కర్పించబడనీ. "సర్వం కృష్ణమయం జగత్" అను భావనలో నిండిపో. శ్రీకృష్ణ చైతన్యములో మైమరచి ఉండిపో. నీవే కృష్ణుడివై నిలిచిపో! విజయోస్తు.

సామాన్య సాధకులకు పైన తెలిపిన పారవశ్యజనిత దివ్యోన్మాదస్థితి అంత సులభముగా లభించదు. మాలిన్యముతో మనసు నిండియుండుటయే దానికి కారణము. మనోమాలిన్యమును కడిగి శుద్ధి చేసుకొన గలిగినచో అట్టి వ్యక్తి ఆధ్యాత్మిక వ్యక్తిత్వముతో శోభించును. భగవన్నామ స్మరణయే అందులకు తరుణోపాయము. శరీరమును నీటితో కడిగి శుభ్రము చేసుకొను విధముగ భగవన్నామ స్మరణచే అంతఃకరణను కూడా శుద్ధిపరచుకొనవలెను.

"మానసం స్నానం విష్ణు చిన్తనమ్"

"విష్ణుచింతనమే మానస స్నానము" అని శాస్త్రనిర్ణయము. విష్ణుచింతన మలవడిన వ్యక్తి సర్వత్ర విష్ణుదేవునే దర్శించును. అట్టి సమదర్శన వీక్షణములో సమస్యలన్నీ సమసిపోవును. మనస్సులోని వాసనలు అడుగంటిపోవును. భగవద్దర్శనాభిలాష తప్ప మరియొక కోరిక స్ఫురించదు.

ఈ ప్రపంచములో గోచరించు ప్రతి వస్తువు సత్యమును మరుగుచేయు తెరవలె యున్నది. అనిత్య కాంతి కిరణ ప్రసారముతో మన నేత్రాలను మభ్యపెట్టి, మాయాజీవన సుడిగుండములో పడత్రోయుచున్నది.

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం"

"జగన్నాథుని ముఖము స్వర్ణపాత్రచే కప్పబడియున్నది" అని ముండకోపనిషత్ తెలియజేయుచున్నది. తెరసొగసును వీక్షించుటతోనే మన బ్రతుకు అంతరించుచున్నది. తెర వెనుకటి యశస్సును సంతరించుకొను శుభగడియ ఎప్పుడో కదా? అనేక జన్మలనుండి ఆడిన ఆటనే ఆడుతున్నాము. నడచిన బాటనే నడుస్తున్నాము. ఆటపైఆశ తీరడంలేదు. బాటపై విసుగు జనించుటలేదు.

ఆత్మబంధువులారా! తమస్సును వదిలివేయండి. ఉషస్సును ఉదయించనివ్వండి. నేత్రములను విప్పి చూడండి. శ్రీకృష్ణ నామామృత పానము చేయుటకు మీ అంతఃకరణ ప్రస్తుతము అనుకూలముగా యున్నది. శ్రీకృష్ణదేవుడు మీ హృదయ గర్భగుడిలో ప్రవేశించు శుభగడియ ఇదియే. నామాట నిజము కానిచో మీరు ఈ గ్రంథమును ముట్టుకొనేవారే కారు. వాసుదేవుని అనుగ్రహం మీపై వర్షించబోతున్నది. కృష్ణచైతన్యంతో మీ మది తడిసిపోనున్నది. లేవండి. అనేక జన్మలలో మనకు యవ్వనము అందించబడినది. అప్పుడంతా వృధాచేసుకున్నాము. కరుణామయుడైన భగవానుడు ఈ జన్మలో మళ్ళీ ప్రసాదించాడు. ఆలోచించండి. నూతన జీవన బాటలో నడిచి తరించడమో, గత జీవన ఊబిలో దిగి అంతరించడమో? మనవిధికి మనమే కర్తలము.

భగవానుని విశ్వసించి, జీవించువానికి కొరతలేదు. సకాలములో నీకు సర్వమూ సమకూర్చబడుతాయి. నీ కష్టాలను అంతముచేసి, నిన్ను కడతేర్చు కరుణాసముద్రుడు భగవానుడొక్కడే. భగవదానుభూతిని పొంది తరించుటకు ఏకైక మార్గమేమిటో తెలుసునా? అలా తరించవలయునని నిరంతరము త్రికరణ శుద్ధితో చింతించుటయే. నీ ప్రార్థనలు భగవానుడు తప్పక వింటాడు. నీ

తోడుగా ఉంటాడు. నిన్ను ఉద్ధరిస్తాడు. నిన్ను తనలో ఐక్యం చేసుకొంటాడు. తానే నీవనెడి అనుభూతిని ప్రసాదిస్తాడు.

"యద్ దుర్లభం యదప్రాప్యం మనసో యన్న గోచరమ్
తదప్యప్రార్థితం ధ్యాతో దదాతి మధుసూదనః"

"అగోచరమైనదియు, మనస్సుచే పొందుటకు వీలులేనిదియు, దుర్లభమైనదియగు దానిని తాము కోరకున్నను మధుసూదనుడు భక్తుల కనుగ్రహించును" యని గరుడపురాణము ఘోషించుచున్నది.

భగవానుడు ధర్మస్వరూపుడు. ధర్మమునకు అతీతుడు. ధర్మచ్యుతిని ఖండించును. ధర్మస్థితినుండి అతీతస్థితికి నడిపించును. తాను దయా స్వరూపుడు. తన కరుణ అందరిపై సమానముగా వర్షించును. తాను సర్వులకు అందుబాటులో యుండును. పిలిచిన పలుకును. తలచిన తరింపచేయును. విలపించినచో బంధమును విడిపించును. కన్నీరు కార్చగా కనులముందు కనుపించును. ఆద్యంతములు తానై యున్నాడు. తన వైభవమును వేదమాతే వర్ణించలేకపోయినది. భక్తులకు తానే సర్వమునై యున్నాడు. జగద్రక్షకుడు తానై యున్నాడు. సృష్టి స్థితి లయములకు తాను కారణమై యున్నాడు. హృదయ గ్రంథిని త్రుటిలో తొలగించును. అజ్ఞానము నంతమొందించును.

సకల శక్తి సమన్వితుడైన యట్టి దేవదేవుని స్మరించి, తరించని జన్మమెందులకు? బ్రతుకు వచ్చిందే భగవంతుని పొందేందుకు. వచ్చిన పనిని నెరవేర్చుకొనుట విజ్ఞుల కర్తవ్యము. కనుకనే సర్వకాల సర్వావస్థలయందు దైవచింతనమే ప్రసాదించమని భక్తులు ప్రార్థించారు. ఈ భావమునే భాగవతము దశమ స్కంధము ధృవపరచింది.

నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీపేరన్ పనిసేయు హస్తయుగముల్ నీ మూర్తిపై జూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపై జిత్తముల్
నీపై బుద్ధులు నాకు నిమ్ము కరుణన్ నీరజ పత్రేక్షణా !

ప్రతి భక్తుని ఆంతరంగిక ఆర్తి ఈ విధముగనే యుండవలెను. ప్రాపంచిక విషయ లంపటత్వమును మనస్సునుండి దూరము చేసుకొనవలయును. అశాశ్వతమైన ఈ ప్రపంచములో ఎంత శ్రమించినను నిత్య సుఖప్రాప్తి కలుగదు.

"పునః పునశ్చర్విత చర్వణానాం" (*Chewing the chewed*)
పాడిన పాటేగాని క్రొత్తబాట లేదు. రాదు. ఈ సత్యమును తెలిసినను పాత పద్ధతులలోనే రమించువారికి "శ్రమ ఏవహి కేవలమ్" మిగులునది శ్రమ మాత్రమే.

వేదము గోవిందుని యశస్సును గానము చేయుచు "లక్ష్మీ సహస్ర శత సంభ్రమ సేవ్యమానాం" అని స్తుతించడము జరిగినది. నిరంతరము శత లక్ష్మీదేవులచే భక్తితో సేవించబడువాడు అని దాని అర్థము. భక్తులారా! ఐశ్వర్య ప్రదాతయగు లక్ష్మీదేవిని సంపద ననుగ్రహించమని నిత్యము మనము ప్రార్థించుచుందుము. అట్టి ప్రసన్న లక్ష్మీమాతలు వందలవేల సంఖ్యలో నిలబడి గోవిందునికి సేవ చేయుచున్నారు అని వేదమాత తెలియజేయుచున్నది. లక్ష్మీపతి వైభవము అవగతమైనదా? అట్టి పురాణపురుషుడు మనకు అత్యంత ప్రియతముడై, సఖుడై యున్నాడు. ఈ సత్యమును భగవానుని వాక్కుల ద్వారా ఆలకించెదము.

9-29 "సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి ప్రియః
యే భజన్తి తు మాం భక్త్యా మయితే తేషు చాప్యహమ్"

"సర్వప్రాణులయందును నేను సమదృష్టి గలవాడను. నేను ద్వేషించువాడును లేడు. నాకు ఇష్టుడును లేడు. అయితే ఎవ్వరు నన్ను భక్తితో సేవింతురో వారు నాయందు ఉందురు. నేను వారి యందు ఉందును" అని శ్రీ కృష్ణపరమాత్మ రాజవిద్యా రాజగుహ్యయోగమునందు తెలిపియున్నారు.

మనలో భగవానుడు, భగవానునియందు మనము, ఆహా! అపూర్వ దివ్యానుభూతి! అనిర్వచనీయ అఖండ రసానుభూతి! ఇట్టిమధురానుభూతిలో మాధుర్య జీవనమును సాగించి, ముక్తాత్ములై తరించవలయునన్నచో మధురాధిపతియైన మాధవ నామ మాధురిలో మునిగి తేలుటయే మార్గమని బోధపడినది. భగవదానుభూతి నొసంగు భగవన్నామ మహిమ అవగతమైనది. భగవంతునికి నామములు అనంతములు. అనంత నామములు అనంత మార్గములై అలరారుచున్నవి. అనంత నారాయణుని సన్నిధికిచేర్చు సహస్ర నామములు భక్తుల అభీష్టముల ననుసరించి సహస్రమార్గములై ప్రకాశించుచున్నవి. అవియే విష్ణుసహస్రనామములు. సహస్రనామ కుసుమములను చేర్చి,కూర్చి తీర్చిన మాలయే శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము. భక్తులారా! భాగవత ప్రియులారా! ముముక్షువులారా! చదవండి. చదువులలోని మర్మమును చవిచూడండి.

# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము శ్రీ మన్మహాభారతములోని అనుశాసనిక పర్వములో భీష్మ యుధిష్ఠర సంవాద రూపమున జరిగినది. అంపశయ్యపై పవళించియున్న భీష్ములవారు ధర్మజుడు అడిగిన ఆరు ప్రశ్నలకు సమాధానము గావించిన స్తోత్రమే ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము. అంతకు పూర్వమే భీష్మాచార్యులవారు వ్యాసభగవానునివద్ద ఆసీనులై విష్ణు సహస్రనామమును ఆలకించి యున్నారు. వ్యాసభగవానుని శిష్యులు అక్కడక్కడ గానం చేసినట్లుకూడా తెలియుచున్నది. కానీ భీష్మాచార్యులవారు మృత్యుశయ్యపై పవళించి, దేహత్యాగము చేసేముందు పాండవ, వ్యాస, ధర్మజ, శ్రీకృష్ణాదుల ఎదుట మొదటిసారిగ స్తోత్ర పారాయణ చేయుట జరిగినది. ఆదిదైవమైన శ్రీకృష్ణ పరమాత్మకు సహస్ర నామార్చన ప్రత్యక్షముగ, ప్రథమముగా భీష్ములవారు చేసినట్లయినది. రామచంద్రుని ఎదుట రామాయణము గానము చేయబడినట్లు కృష్ణభగవానుని ఎదుట విష్ణు సహస్రనామ స్తోత్రము గానము చేయడము జరిగినది. భగవానుని వేయి నామములు కలిపి స్తోత్రరూపములో గానము చేయుట జరిగినది.

శబ్దము ద్వారా వ్యక్తమైన భక్తి స్తోత్ర మనబడుతుంది. భక్తుని హృదాంతరాళమున పొంగి పొరలిన ఆవేశ భక్తి తరంగాల సముదాయమే స్తోత్రము.

నమస్కార స్తథాశీశ్చ
సిద్ధాంతోక్తిః పరాక్రమః
విభూతిః ప్రార్ధనాచేతి
షడ్విధం స్తోత్ర లక్షణమ్

నమస్కారము, ఆశీర్వాదము, సిద్ధాంత నిర్ణయము, శక్తినిర్దేశము, ఐశ్వర్య విశదీకరణ, ప్రార్థన అను ఆరు లక్షణములు గలది స్తోత్ర మనిపించు కొనునని శ్రీ శంకర భగవత్పాదులు తెలియజేసి యున్నారు. ఈ ఆరు లక్షణములతో అలరారు అసమాన స్తోత్రము శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము.

సహస్రనామ స్తోత్రములు అనేకములు గలవు. వరాహ పురాణమందును, వామన పురాణమందును కూడా కలవు. సహస్రనామ స్తోత్రములలో విష్ణు, శివ, దేవి సహస్రనామ స్తోత్రములు ప్రశస్తములు. శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము సకల శక్తిసమన్వితమై బహుజన ప్రియామోదమును బడసి ఎక్కువ ప్రాచుర్యము నొందినది.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమునకు అనేకమంది వ్యాఖ్యలు వ్రాసి యున్నారు. విష్ణువల్లభ, ఆనందతీర్థ, గంగాధర యోగీంద్ర, మహాదేవ వేదాంతి, రంగనాథాచార్య, రామానుజ, విద్యారణ్య తీర్థ, సుదర్శన భట్టాచార్యులు విష్ణు సహస్రనామ స్తోత్రమునకు భాష్యములు వ్రాసినట్లు తెలియుచున్నది. శ్రీ రామానందతీర్థ, బ్రహ్మానంద భారతి అను ఇరువురు మాత్రము శంకరులవారి భాష్యము నకు భాష్యము వ్రాసినట్టు తెలియుచున్నది. ఇప్పటివరకు ఈ స్తోత్రముపై వచ్చిన వ్యాఖ్యలలో శ్రీ శంకర భగవత్పాదులు, శ్రీ పరాశర భట్టారులు వ్రాసిన వ్యాఖ్యలు ముఖ్యములు. శ్రీ శంకరులు అద్వైతపరంగా వ్యాఖ్యను నడుపగా శ్రీ పరాశర భట్టార్యులు విశిష్టాద్వైత పరంగా వ్యాఖ్య చేశారు. ఇరువురు భాష్యకారులు జీవించిన కాలము ముప్పది రెండు సంవత్సరములే యను విషయము గమనించదగినది. భట్టారు రచించిన వ్యాఖ్యకు "భగవద్గుణ దర్పణ" మని పేరిడిరి.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమునకు శ్రీ శంకరులవారు చేసిన వ్యాఖ్యానము సర్వజన సమ్మతమై అలరారుచున్నది. శ్రీ మన్మహాభారత భాష్యకారులైన నీలకంఠులవారు భారత గ్రంథముపై వ్యాఖ్య చేయుచు శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రముపై మాత్రము వ్యాఖ్యానించక, శ్రీ శంకర భగవత్పాదులవారి వ్యాఖ్య ననుసరించమని తెలియచేసిరి. శ్రీ శంకరభాష్య పటిమ ఎలాంటిదో దీనివిబట్టి గ్రహించనగును. శ్రీ శంకరులు ముగ్గురు శిష్యులను వేరువేరుగా పిలిచి తన గ్రంథాలయము నుండి ఒక పుస్తకమును తీసుకొని రమ్మని తెలియజేయగా ఆ ముగ్గురు శిష్యులు శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమునే తీసుకొనివచ్చిరనియు, అంతట సరస్వతీదేవియే ప్రత్యక్షమై విష్ణు సహస్రనామ స్తోత్రానికి భాష్యం వ్రాయమని కోరగా శ్రీ శంకరులు వ్రాసినట్లు కూడా తెలియుచున్నది.

నామమునకు, నామికి తేడాలేదు. భగవంతుని సహస్ర నామములను కూర్చి అందించిన ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము భక్తుల హృదయ మందిరాలలో

అఖండజ్యోతియై వెల్గొందుచున్నది. ప్రతి నామము వేయి నామముల మహిమను, శక్తిని కల్గియున్నదని శఠ గోప యతీంద్రులు (నమ్మాళ్వారు) తన "భగవద్విషయము" అనెడి గ్రంథములో రచించారు.

అనంతుడైన భగవానుని వేయి సంఖ్యతో అర్చించడము ఒక గొప్ప విశేషము. సహస్రమను పదమునకు అనంతమనెడి భావమును సాయనాచార్యులు వేదభాష్యంలో తెలియజేసియున్నారు. చతుర్వేదాంతర్గతమైన పురుష సూక్తములో భగవానుని విరాడ్రూపాన్ని వర్ణిస్తూ "సహస్ర శీర్షం పురుషః సహస్రాక్ష సహస్రపాత్" వేయితలలు, వేయినేత్రములు, వేయి పాదములు కలిగియున్నట్లు వర్ణించబడినది. కనుక వేద సారభాన్ని వెదజల్లుచున్న ఈసహస్రనామ స్తోత్రము పావనమై, దరిచేరు వారలను పవిత్రులను చేయుచున్నది.

ఈ సహస్రనామ స్తోత్రములో పుంలింగములో ప్రయోగింపబడిన నామములు శ్రీ మహావిష్ణువు నుద్దేశించి స్తుతించినవిగా గ్రహించాలి. కొన్ని చోట్ల స్త్రీలింగములో కూడా వాడబడియున్నవి. వానిని దేవతాపరమైన వానివిగా గుర్తించాలి. మరి కొన్ని చోట్ల నపుంసక లింగములో ప్రయోగించబడి ఉన్నవి. అవి అక్షర పరబ్రహ్మను తెలియచేస్తున్నట్లు గ్రహించాలి. కొన్నిచోట్ల శివసంబంధమైన నామములు కూడా ఉన్నవి. శివకేశవ భేదము సముచితము కాదని నిర్ణయించి, నిర్దేశించడమే అందులోని భావార్థము.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర వైభవము వర్ణనాతీతము. దాని ప్రయోజనము అనిర్వచనీయము. విష్ణు సహస్రనామ స్తోత్రమును పారాయణ చేయువారు సమస్త ఉపద్రవములనుండి విడివడుదురనియు, ముఖ్యముగా ఎంతటి భయంకర వ్యాధి నుండైనను విముక్తి నొందెదరనియు ఆయుర్వేద శాస్త్రము తెలియ జేయుచున్నది. ఇంతెందులకు? "రోగార్తోముచ్యతే రోగాత్" రోగపీడితుడు ఆరోగ్యవంతుడగునని స్తోత్రఫలశ్రుతియందే కలదు. అయితే ఇక్కడ ఒక విషయమును పరిశీలించి, జీవితానికి ఈ స్తోత్రపారాయణ ద్వారా పరిపుష్టిని కల్గించుకోవాలి. భౌతికరోగ నిర్మూలన ముఖ్యమో, భవరోగ నిర్మూలన ముఖ్యమో సాధకులు ఆలోచించుకో గలగాలి. ఈనాటి ఉపాధికి ప్రాప్తించిన రోగమును నయము చేసుకొని పొందే ప్రయోజన మేముంటుంది? అజ్ఞాన గ్రంథులు వీడనిచో అనేక జన్మలు భవిష్యత్తులో మనకై నిరీక్షించు చుండును. ఆలోచించండి. వెలగల రత్నములను రేగుబండ్లకు దారబోయునట్లు

మోక్షప్రాప్తి నొసంగు సహస్రనామ స్తోత్రమును భౌతికవ్యసన నిర్మూలన కుపయోగించి దుర్వినియోగ మొనరించుకొనుట సమంజసమా? సోదరీ సోదరులారా! మనో నిర్ణయాలకు తలవొగ్గి జీవించకండి. మనసిచ్చే ఆదేశాలను అమలుపరచే అయోమయ స్థితికి దిగజారకండి. బుద్ధి నుపయోగించి యోచించండి. సత్యము గోచరమవుతుంది. సత్యము ఆదిలో విషముగా గోచరించి, అంత్యములో అమృతముగా భాసిస్తుంది. అసత్యము ఆదిలో అమృతములా గోచరించి, అంత్యములో విషపూరితంగా మారుతుంది.

శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రము మానవాళికి అత్యంత ఉపయుక్తమగు గ్రంథమనుటలో సందేహము లేదు. భగవానుని అనంత కళ్యాణ గుణములను సులభ శైలిలో సర్వజన గ్రాహ్యంబగు రీతిలో ఈ స్తోత్రమునందు రచించియుండు టచే ఈ స్తోత్రము సర్వజనామోదమునకు పాత్రమైనది. కేవలము వేదాంత గ్రంథ పరిచయములో పండిన విద్యావంతులకు పండితులకేగాక సామాన్యజనులు సైతము గానము చేయుటకు, భగవానుని కళ్యాణములను మననము చేయుటకు అవకాశ మున్నందున ఈ స్తోత్రము బహుళ ప్రచారము గావింపబడినది. అదియునుగాక వేదసారము ఇందు నిండియుండుట కూడా సహస్రనామ ప్రభావ ప్రచారమునకు ముఖ్యకారణమై యున్నది.

ఈ స్తోత్రము సహస్ర నామముల కలయిక అయినను ప్రస్థానత్రయ, పురాణేతిహాసములతో సంబంధ సమన్వయములు గలిగి, వేదాంతభావ సౌరభమును తనలో సంతరించుకొని సన్మంగళప్రదమై రాజిల్లుచున్నది. అదియునుగాక మహాభక్తుడు, భాగవతోత్తముడు, నిరంతరము శ్రీ కృష్ణపదసరోజ ధ్యానచిత్తుడు, త్యాగమయుడు నగు భీష్మాచార్యులవారి ముఖతః వెలువడుట కూడా ఈ స్తోత్ర ప్రాశస్త్యము ఇనుమడించుటకు ముఖ్యకారణములలో ఒకటియని భావింపదగును. అవతారమూర్తియైన శ్రీ కృష్ణ పరమాత్మయే భీష్మునిచెంత కరిగి, ధర్మ రహస్యములను గ్రహించమని ధర్మజునికి సలహా నొసంగెను.

ఈ స్తోత్రము వేదసంస్కర్తయైన వ్యాసభగవానుని అపూర్వ సృష్టి కావడము మరియొక కారణము. నారాయణుని అవతారమైన వేదవ్యాసుడు వేదసాగరపు లోతులలో ప్రవేశించి, భగవన్నామములనే సహస్ర ఆణిముత్యము లను సేకరించి, వాటిని స్తోత్రమాలగా దీర్చి, అలంకరించుకొని శోభించండని భక్తుల కొసంగెను.

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము మహాభారతమునకు పూర్వమే లిఖించ బడియుండెను. శ్రీ కృష్ణదేవుని సాన్నిధ్యములో భక్తాగ్రగణ్యుడైన భీష్మాచార్యులవారు ప్రథమంగా గానము చేయవలెననెడి ఉద్దేశ్యముతో శ్రీ వేద వ్యాసుడు దానిని దాచియుంచెను.

స్తోత్రము చివర 'ఓం నమః' అని చెప్పబడియున్నది. ఇలా తెలియ చేయబడిన నమస్కారము ద్వారా భక్తుని సంపూర్ణ శరణాగతి ప్రకటితమగు చున్నది. అర్చన సమయాలలో ప్రతినామము చివర "ఓం నమః" అని ఉచ్చరింతుము. "నమః" అనగా 'న అహం' – "న మమ" అని భావము. "నేను కాదు – నాది లేదు" ఇదియే భక్తుని కుండవలసిన దివ్యభావన. నేను నిమిత్త మాత్రుడను. సకలము వాసుదేవుని దివ్యశక్తియే. నాదంటూ ఏమీలేదు. సర్వమున్నతని దివ్యకళామయము అను భావముతో జీవించుటయే "నమః" అను పదములో భావార్థము. అహంకార మమకారములు తొలగగానే స్వరూపస్థితి కలుగును. అదియే "ఓం" కారము ద్వారా తెలియజేయబడినది. ప్రతి నామోచ్చరణలో "ఓం నమః" అనునవి చేరుటవలన యజ్ఞము ఆచరించిన ఫలము కలుగుచున్నది. సహస్రనామ స్తోత్ర పారాయణవలన సహస్ర యజ్ఞము లాచరించిన ఫలము లభించుచున్నది. దివ్యాత్మ స్వరూపులారా! విష్ణు సహస్రనామ స్తోత్ర ప్రభావము తెలిసినదా? మరి చూస్తారేం? ముందుకు కదలండి . ముక్తి ద్వారము చెంతకు నడవండి.

## భీష్ముడు

మహానుభావులను సైతము మైమరపించి, మత్తులో దించి, మోసగించే మాయలమారియే మోహము. మానవ హృదయంలో శాంతిని మటుమాయం చేసే ఈ మోహభ్రాంతిని ప్రతివ్యక్తి ఎదుర్కొనవలసిన దుర్ముహూర్తం ఒకటి ఉండనే ఉంటుంది. అలాంటి బీభత్స సన్నివేశము గతంలో ఒకచోట తొంగిచూసింది. జహ్నుమహర్షి పుత్రికయైన గంగాదేవి అందచందాల ముందు పిచ్చివాడై నిలబడిపోయాడు శంతన మహారాజు.

"నీవెవరైనా ఫరవాలేదు. నీవు నా అర్ధాంగివి కావాలి" అని అర్థించాడు. ఆమె ప్రేమకు దాసుడై, తన సంపదను, చివరకు రాజ్యమును దారబోయుటకు కూడా సిద్ధపడ్డాడు.

శంతన మహారాజుని పరిణయ మాడుటకు గంగాదేవి షరతులపై అంగీకరించింది. తానెవరో, ఎక్కడనుండి వచ్చినదో ప్రశ్నించుటకు వీలులేదని తెలియచేసింది. తాను చేయు ఏ కార్యమును గూడా అడ్డగించుటకు వీలులేదని చెప్పింది. శంతనుడు సరేనన్నాడు. వివాహము జరిగిపోయింది.

వారికి సంతానము కలిగినది. బిడ్డ పుట్టగానే ఆ శిశువును తీసుకొని వెళ్ళి నదిలో పారవేసి, నవ్వూతూ తిరిగి వచ్చేది గంగాదేవి. ఇచ్చిన మాటను తప్ప లేక శంతనుడు కాదనలేకపోయాడు. ఎనిమిదవ బిడ్డను గంగలో పారవేయు సమయాన శంతనునిలో పుత్రవాత్సల్యం పెల్లుబికింది. అలా చేయడం సముచితము కాదని వారించాడు. తనను వారించి, ఇచ్చిన మాటను తప్పిన శంతనునితో తాను ఇక కాపురము చేయనని తెలిపినది గంగాదేవి.

"రాజా! నేను ఈ బిడ్డను చంపను . నీ నుండి నిష్క్రమించే ముందు నా జీవిత రహస్యమును తెలియజేసెదను. వినుము. దేవతలచే, మానవులచే ఆరాధించబడు గంగామాతను నేను.

"ఒకనాడు అష్టవసువులు తమ ధర్మపత్నులతో కూడి విహరించుచు, వసిష్ఠ మహర్షి ఆశ్రమము చెంత కరుదెంచారు. ఆశ్రమ ప్రాంగణములో యున్న నందినీ ధేనువును చూశారు. వారిలో ఒకతె నందినీ కావలయునని వాంఛించినది. వసిష్ఠ మహర్షికి చెందిన నందినీ ధేనువుని పరిగ్రహించుట సబబుకాదని ఎందరు వారించినను ఆవిడ వినలేదు. తప్పనిసరి కాగా నందినీని తమవెంట తీసుకొని వెళ్ళారు. వసిష్ఠమహర్షి ఆశ్రమమున కరుదెంచగా నందినీ ధేనువు కనుపించలేదు. తన దివ్యదృష్టిచే విషయమును గ్రహించిన వసిష్ఠులవారు, అష్టవసువులు భూలోకమున జన్మించునట్లు శాపము పెట్టిరి. వసిష్ఠుని శాపమునకు భయ కంపితులైన అష్టవసువులు ఆ మహర్షి పాదములపై బడి మొరపెట్టుకొనగా దయా స్వరూపుడైన ఆ మహర్షి కరుణించి, తపోమహిమచే నిర్ణయించిన శాపమును రద్దుచేయ వీలు లేదనియు, భూలోకమున వారు జన్మించిన వెంటనే శాప విముక్తిని పొందెదరనియు, నందినీ మాతను పరిగ్రహించిన ప్రభాసుడను వసువు మాత్రము భూలోకమున వైభవోపేతమైన జీవితమును గడుపునని తెలియజేసెను. అష్టవసువు లందరు నన్ను శరణుజొచ్చి, వారికి జన్మనిచ్చు నిమిత్తము భూలోకమున ఆవిర్భవించమని కోరగా, నేను అలా జన్మించి, మహానుభావులైన మిమ్ములను పరిణయమాడుట జరిగినది. ఏడుగురు వసువులు

శాపవిముక్తిని పొందిరి. ఎనిమిదవ వసువైన ఈ బిడ్డను నేను కొంతకాలము పెంచి, మన ప్రేమ కానుకగా మీకు తిరిగి అప్పగించగలన"ని చెప్పిపిల్లవానితో సహా గంగాదేవి అంతర్ధానమయ్యెను.

గంగాదేవి శంతనుని వదలి చనగానే శంతనుడు విషయ సుఖాలను విసర్జించి, సన్యాసివలె రాజ్య పరిపాలన చేయసాగెను. ఒకనాడు గంగాదేవి బాలుని వెంట నిడుకొని శంతనుని చెంత కరుదెంచి "మహారాజా! ఇతడే మన అష్టమ పుత్రుడు. పేరు దేవవ్రతుడు. విద్యాపారంగతుడు. విలువిద్య యందు అసమాన ప్రజ్ఞాశాలి. వసిష్ఠ మహాముని చెంత సకలవిద్యల నభ్యసించిన ఈ యువరాజ రత్నమును మీకు అందించుచున్నాను" అని చెప్పి మఱలిపోయెను.

సర్వశాస్త్ర కోవిదుడు, ప్రజ్ఞాశాలియైన దేవవ్రతునికి యువరాజ పట్టాభిషేకము గావించినాడు శంతన మహారాజు. కాలచక్రం తిరిగింది. నాలుగు ఆకులు కదిలాయి. ఒకనాడు శంతన మహారాజు యమునా నదీతీరమున విహరించుచు, సత్యవతి యను మత్స్య కన్యను గాంచెను. గంగాదేవి దూరమైన క్షణమునుండి అంతర్ముఖమైయున్న మోహావేశము తిరుగ బహిర్ముఖమయ్యెను. సత్యవతి అందచందాలు శంతనుని అమాంతంగా ఆకర్షించెను. తనను పరిణయమాడమని శంతనుడు కోరెను. సత్యవతి తండ్రి ఒక షరతుపై వారి వివాహమును అంగీకరించుటకు నిర్ణయించెను. తన పుత్రికయైన సత్యవతికి కలుగబోవు బిడ్డడు రాజ్యాధినేత కావలయునని అభిలషించెను. శంతనునికి భూమ్యాకాశములు ఒకటయినట్లనిపించింది. గంగాపుత్రుడు, దివ్యాత్ముడైన దేవవ్రతునికి అన్యాయము చేయుటకు తన మనస్సంగీకరించలేదు. తన ప్రయత్నమును రద్దు చేసుకొని ఇంటికి మఱలెను.

సత్యవతి రూప లావణ్యము ఒకవైపు శంతనుని హృదయమును కలవరపరచ సాగెను. దేవవ్రతునికి జరుగబోవు అన్యాయము మరియొకవైపు కనులముందు ప్రత్యక్షమై కలతపెట్ట సాగెను. సంఘర్షణాపూరిత జీవనమును సాగించ లేక శంతనుడు సతమతమగుచుండుట దేవవ్రతుడు గుర్తించెను. తండ్రిలో బయలుదేరిన కలవరమును గాంచి కలత చెందినవాడై, కారణమును తెలియజేయుమని తండ్రిని ప్రార్థించి విఫలుడయ్యెను. తండ్రిగారి రథచోదకుని ద్వారా విషయమును గ్రహించెను. తండ్రి మనోభీష్టమును నెరవేర్చ యత్నించెను. సత్యవతి తండ్రిని కలిసెను. తన తండ్రి వివాహమునకు వారు పెట్టిన షరతులను ఆలకించెను. తండ్రి సుఖమే తన సుఖముగా భావించిన దేవవ్రతుడు వారి

షరతులకు కట్టుబడెను. రాజ్యమునకు వారసుడగు తన హక్కును వదలుకొనుటకు నిశ్చయించుకొని వారికి మాట నొసంగెను.

దేవవ్రతుని త్యాగమునకు సత్యవతి జనకుడు సంతసించి, "యువరాజా! మీ త్యాగము అసమానము. అద్భుతము. మీలాంటి త్యాగమే మీ పుత్రులకు ఉంటుందని చెప్పలేము. భవిష్యత్తులో మీ కుమారులు వారసులుగా నిలిచే ప్రమాదము లేదంటారా? అది అలా జరిగినపుడు ఈనాడు మీరు చేసిన త్యాగమునకు ఫలితమేమిటి?" అని ప్రశ్నించెను.

దేవవ్రతుని నేత్రాలు కాంతి కిరణములను విరజిమ్మెను. దేహము కొయ్యవలె కదలికను కోల్పోయెను. సాహసోపేతమైన నిర్ణయమేదో అతని ఆంతర్యంలో జరుగుచున్నట్లు ముఖమునందు ప్రస్ఫుటముగా గోచరించెను. అంతే. దేవవ్రతుడు పిడికిలి బిగించి, చేయి పైకెత్తి, "నేను వివాహ మాడనని ప్రతిజ్ఞ చేయుచున్నాను. అస్ఖలిత బ్రహ్మచారినై, జీవిత మంతయు కొనసాగెదనని ప్రమాణము చేయుచున్నాను" అని పలికెను. ఆహా... "త్యాగే నైకే అమృతత్వమానశుః" అమృతత్వము త్యాగముతోనే సిద్ధించాలి.

దేవవ్రతుడు ప్రతిజ్ఞ చేయుచుండ పులకాంకితులైన దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి. ఆర్ష సంస్కృతి గ్రంథములో అడుగడుగున గోచరించు అసమాన త్యాగ జీవన పుటలలో దేవవ్రతుని త్యాగము సువర్ణాక్షరాలతో లిఖించబడి యున్నది. భీషణమైన ప్రతిజ్ఞ చేశాడు. భీష్ముడయ్యాడు. స్వార్థ జీవన గ్రీష్మ తాపమును తన త్యాగమయ వర్షధారచే చల్లబరచాడు.

సత్యవతికి చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అను ఇరువురు కుమారులు కలిగిరి. చిత్రాంగదుడు పెరిగి పెద్దవాడై రాజ్యభారము వహించుచు, ఒక గంధర్వునితో పోరాడు ప్రయత్నములో మరణించెను. సంతానములేని చిత్రాంగదుడు మరణించగా అతని తమ్ముడైన విచిత్రవీర్యుడు రాజు కావలసి వచ్చెను. విచిత్ర వీర్యుడు బాలుడగుటచే రాజ్యభారము వహింప తగడని భీష్ముడే తన తమ్ముని పేర రాజ్యపాలన చేసి, వయస్సు కలిసిరాగానే విచిత్ర వీర్యునికి పట్టాభిషేకము చేసెను.

విచిత్రవీర్యునికి యుక్త వయస్సు వచ్చెను. వివాహము చేయ పెద్దలు ఇష్టపడిరి. కాశీరాజు తన ముగ్గురు కుమార్తెలకు స్వయంవరమును చాటెను.

భీష్ముడు ఆ స్వయంవరమునకు హాజరై, అచట భీకరపరిస్థితులను ఎదుర్కొనెను. చివరకు తన పరాక్రమముతో అందరిని ఓడించి, కాశీరాజు పుత్రికలైన అంబ, అంబిక, అంబాలిక అను ముప్పురిని రథములో తీసుకొని వచ్చుచుండెను. ఇంతలో అంబను ప్రేమించి వివాహమాడుటకు సిద్ధముగాయున్న సౌబల రాజ్యాధినేతయైన శల్వుడు మార్గమధ్యములో భీష్ముని ఎదుర్కొని అపజయమును పొందెను. భీష్ముడు కాశీరాజు ముగ్గురు పుత్రికలను తన తమ్మునికిచ్చి వివాహముచేయ నిర్ణయించగా, అంబ నిరాకరించెను. శల్వుని ప్రేమించిన తనను ఇలా బలిపశువులా అన్యాయం చేయుట సబబు కాదనెను. ధర్మస్వరూపుడైన భీష్ముడు ఆమెకు రక్షణను, సంపద నిచ్చి శల్వుని వద్దకు పంపి, అంబిక, అంబాలికలను విచిత్రవీర్యుని కిచ్చి వివాహము చేసెను.

శల్వుని చేరిన అంబ నిరాకరించబడి, అవమానించబడెను. పదుగురిలో భీష్మునిచే పరాభవించబడిన శల్వుడు అంబను అర్ధాంగిగా స్వీకరించుటకు నిరాకరించెను. అంబ భీష్ముని చేరి తన మొర వినిపించెను. భీష్ముడు విచిత్ర వీర్యుని పిలిచి అంబను వివాహమాడమని తెలియచేయగా, విచిత్రవీర్యుడు నిరాకరించెను. చివరకు అంబ తనను వివాహమాడమని భీష్మునే ప్రార్థించెను. ధర్మ పరాయణుడైన భీష్ముడు ప్రతిజ్ఞను వమ్ము చేయలేక నిరాకరించెను. గాయపడిన మనసుతో అంబ తన దురదృష్టమునకు చింతించెను. ఆమెలో కదిలిన ఆవేదన చివరకు పగసాధింపు చర్యగా పరిణమించెను. భీష్ముని హతమార్చుమని ఎందరో రాజులను, చక్రవర్తులను అర్థించినది. ఎవ్వరును భీష్ముని ఎదిరించుటకు సాహసించలేకపోయిరి. చివరగా సుబ్రహ్మణ్యస్వామిని గూర్చి అంబ తీవ్రముగా తపమాచరించెను. షణ్ముఖుడు ప్రత్యక్షమై తాజా పద్మములతో కూర్చిన పుష్పమాలను ఆమె కొసంగి, ఆ మాలను ధరించిన వ్యక్తి భీష్మునికి శత్రువై నిలువగలడని చెప్పెను. ఆ మాలను ధరించుటకు ఎవ్వరూ సాహసించరైరి. చివరకు ఆవిడ ద్రుపదమహారాజును శరణు జొచ్చెను. ద్రుపదుడు కూడా నిరాకరించగా, ఆమె ఆ మాలను ద్రుపదుని సంస్థాన ద్వారమునకు వేసి వెడలి పోయెను. వాడని ఆ పుష్పమాల చివరకు మేడద్వారము నలంకరించెను.

అన్వేషణను ఆపని అంబ కొందరి సలహాపై పరశురాముని శరణు జొచ్చెను. అంబ దీనాలాపమును విన్న పరశురాముని మది ద్రవించి కరుణ స్రవించగా, భీష్మునితో పోరాటమునకు దిగి పరశురాముడు పరాజయమును

పొందెను. పరశురాముడు తన అశక్తతను అంబకు తెలియజేయగా నిరాశచెందినదై, హిమా లయముల కరిగి తపస్సు చేసెను. పరమశివుడు ప్రత్యక్షమై, రాబోవు జన్మలో ఆమెయే భీష్మని సంహరించగలదని వరమొసంగెను. మరు జన్మ ప్రాప్తించువరకు సహించలేని అంబ అగ్నిని ప్రతిష్ఠించుకొని అందులో దూకి మరణించెను.

శివానుగ్రహంతో అంబ ద్రుపదరాజు కుమార్తెగా జన్మించెను. కొంత కాలమునకు సంస్థాన ద్వారమునకు వ్రేలాడదీసియున్న వాడని పుష్పహారమును చూసి, తీసి, ధరించుకొనెను. అదిగాంచిన ద్రుపదుడు భీష్మని వలన ఏఅపాయము రాగలదోనని శంకించి, ఆమెను కానల కంపెను. అరణ్యములో కొంతకాలము తపమాచరించి, తత్ఫలితముగా తాను శిఖండి యను పురుషుడుగా మారెను.

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రములో అది పదియవరోజు సంగ్రామము. శిఖండిని ముందుంచుకొని అర్జునుడు భీష్మని ఎదిరించెను. శిఖండి స్త్రీగా జన్మించినదని తెలిసిన భీష్ముడు శిఖండిపై బాణప్రయోగము చేయుటకు నిరాకరించెను. శిఖండి వేయు శరములు భీష్మని శరీరమంతయు అంగుళము ఖాళీలేకుండా నిండిపోయినవి. శిఖండి వెనుకనుండి అర్జునుడు శరప్రయోగము చేసి, భీష్మ పితామహుని అంతిమయాత్రకు సిద్ధము చేసెను. భీష్మని శరీరము బాణములతో నిండియుండుటచేత క్రింద పడలేదు. త్యాగధనుడైన ఆ మహావీరునికి శరములనే పడకగా అమర్చి పరుండబెట్టిరి. దాహముగా ఉందని అర్జునునికి తెలుపగా మహావీరుడైన సవ్యసాచి బాణమును భూమిలోకి వదిలెను. అంతే – కుమారుని అంతిమ క్షణములో కౌగలించుకొని దప్పిక తీర్చుటకు కుతూహలపడుతున్న గంగాదేవి ఒక్కసారి పెల్లుబికి వచ్చినది. భీష్మని దప్పికను తీర్చినది.

ఇది భీష్మని అమర జీవన గాథ. బ్రతుకంతా బాధలతో గడచిపోయింది. ఆయన జీవితములో సుఖపడిన క్షణాలు ఎప్పుడో అర్థంకాదు. అయినను తాను స్థిమితమును ఎన్నడు కోల్పోలేదు. చివరిక్షణం వరకు ప్రశాంత మనుగడను సాగించిన పరమభక్తుడు శ్రీ భీష్ముడు. ఆ కారణము చేతనే అంపశయ్యపై పవళించియున్న భీష్మని వద్దనుండి ధర్మ సూక్ష్మములను గ్రహించమని శ్రీ కృష్ణుడు ధర్మజునికి తెలియచేసెను. ధర్మజుడడిగిన ఆరు ప్రశ్నలకు మృత్యుముఖంలో నిలబడియున్న భీష్ముం డొసగిన సమాధానమే ఈ విష్ణు సహస్రనామ స్తోత్రం చదవండి. భీష్మునివలె అమరులు కండి.



శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము జ్ఞాన సముద్రము. అమృత జ్ఞాన సాగరము. ఇది ఒక గొప్ప ఆధ్యాత్మిక సాహిత్యము. ఈ పవిత్ర సాగరములో సహస్ర జ్ఞాన రత్నములు దాచబడి ఉన్నాయి. ఇందులోని ప్రతి రత్నము అమూల్యమై శత సహస్ర ఆదిత్య తేజముతో ప్రకాశించుచున్నది

అనామధేయునకు అనంత నామ ధేయములు. అనంత నారాయణుని సన్నిధికి చేర్చు సహస్ర నామములు సహస్ర మార్గములై అలరారుచున్నవి. ఇవియే విష్ణు సహస్ర నామములు. సహస్రనామ కుసుమములను చేర్చి, కూర్చి, తీర్చిన మాలయే ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము.

అమృతమయమైన ఈ సహస్ర నామములు విడిపూలు కావని, విడిపోయేవి కాబోవని, ఒకే మాలలో ముడిపడి యున్నవని తన వ్యాఖ్యలో నిరూపించి ఈ గ్రంథమునకు ''నామ రత్నమాలిక'' అని నామమిడినారు పూజ్యశ్రీ స్వామి సుందరచైతన్యానందులవారు. భక్తిజ్ఞానములను మిళితం చేసి తనదైన ఒక బాణిలో వ్యాఖ్యవాణిని నడిపి ఈ అమూల్య గ్రంథమును భక్త ప్రపంచానికి అందించినారు. ఈ గ్రంథము భక్తజనుల బాటలో విజ్ఞాన మణిదీపికయై ప్రకాశించగలదని విజ్ఞుల అభిప్రాయము.